# లిబియా దేశము గురించి



లిబియా దేశము గురించి **{1}** **10-02-24**

**Libya,** దేశము **North** ఆఫ్రికాదేశము . దేశము యొక్క చాలా భూభాగాన్ని **( 90 %** భూభాగాన్ని **}** సహారా ఎడారియే ఆక్రమించి ఉన్నందున **-** జనం ఎక్కువగా లిబియా సముద్ర తీరానికి దెగ్గరలోనే నివసిస్తూ వుంటారు **.**

ట్రిపోలి **Tripoli (Ṭarābulus),**దీని రాజధాని కాగా **Benghazi** అన్నది దీని డిఫాక్టోకాపిటల్ **{** డీఫాక్టో అనగా**--** చట్టము రాజధానిగా గుర్తించిన పట్టణము ఒక చోట ఉండగా **-** అక్కడ ఉండవలసిన ప్రభుత్వ అధికారులంతా వేరే పట్టణం లో వుంటారు దాని దేఫాక్టో కాపిటల్ అంటారు **}**

**Berbers/Amazigh** అనే జాతి వారు ఇక్కడి ఆదిమ జాతులు **.{** మొదటినుండీ వున్నవారు **}** వీరుకాక ఎన్నడో ఈ ప్రాంతానికి వచ్చి స్థిరపడిన జాతులవారు కూడా వున్నారు **{** చాలా కాలంగా వున్నవారు **} .** ఈ రొండు జాతుల వారూ లిబియా దేశ చెరిత్ర మొదటినుండీ కనపడతారు **.** మిగతా జాతుల వారు కనపడరు **.** ఇట్లా అయినపుడు **"**భూమి మీద మొదటి హక్కు మాదే **"** అనే యుద్ధాలు **"**మొదటినుండీ వున్నవారి మధ్య **--** చాలా కాలంగా వున్నవారి మధ్యా చెలరేగుతాయి **.**

ఈ బార్బెర్స్ అనే జాతివారు సహారా ఎడారి కొండల మీద గుట్టల మీదా అనేక జంతువుల చెట్ల బొమ్మలు చిత్రించారు **.** అందువల్ల నే

సాహారి ఎడారి ప్రాంతము ఒకప్పుడు నీటి తో ఉండి - పంటలు పండే భూమి గా ఉండేది అని- ఈ సహారా ఎడారిలో నదులు కూడా పారేవి అని శాస్త్రజ్ఞులు నిర్ధారణ చేశారు . బార్బెర్స్ జాతి వారు మంచిగా పంటలు పండే చోటుపై ఉంటూ ఉండగా - వారితో పోటీ పడలేని ఇతర జాతుల వారు సముద్ర తీరంలోకి వలస పోతూ వుండే వారు . ఇట్లగా లిబియా సముద్రతీరంలోకి జనం చేరారు . సహారా ప్రాంతం క్రమంగా ఎడారిగా మారుతుండగా బార్బెర్ జాతి వారు కూడా సముద్రతీరానికి చేరారు .
ఈరకంగా ఒకరంటే ఒకరికి గిట్టని రెండు జాతులు ఒక చోట నివసించటం జరిగింది .

రోమనులు తమ దండయాత్రలలలో దీనిని ఆక్రమించుకున్నారు . అట్లాగా లిబియా వారికి రాచరిక వ్యవస్థ ను పరిచయం చేసింది . ఈ రాచరిక వ్యవస్థ నొనసాగుతూ వచ్చి --
**Muhammad Idris bin Muhammad al-Mahdi as-Senussi** సంక్షిప్తముగా ఇద్రీస్ అనే అరబ్ లిబియా దేశానికి **24 December 1951** నుండీ **1 September 1969.** వరకూ రాజుగా వున్నాడు. ఇతడు లిబియా దేశానికి రాజు గానే కాక సూఫీ ముస్లిం తెగకు చెందిన మత నాయకుడు కూడా.

**1959** లో లిబియా దేశము లో పెట్రోల్ వున్నదని కనిపెట్టారు . ఆ తరువాత ఇది సంపన్న దేశపు జాబితాలో చేరింది . పెట్రోల్ ని తవ్వి బయటకి తీయటానికి అవసరమైన యంత్ర సామగ్రి రక్షణ వంటివి కావాల్సి వచ్చి - లిబియా-- అమెరికాని, యూకే ని - సంప్రదించగా - తమ మిలిటరీ బేస్ లను లిబియాలో ఏర్పాటు చేసుకోనిస్తే - తాము

సాయం అందిస్తాము అని షరతు పెట్టి అమెరికా తన  సాయం అందించింది . ఆయిల్  డబ్బు రావటం మొదలెట్టినాక ఈ రాజుగారు - అప్పుడిదాకా దేశంలో వున్నా ఫెడరల్ సిస్టం { స్థానిక పాలనా విధానాన్ని } రద్దు చేసాడు . రాజకీయ పార్టీలు లేవు వున్నది అంతా నేనే  అన్నాడు .

లిబియా లో అరబ్ సోషలిస్టులు - అరబ్ నేషలిస్టులు అనే గ్రూప్ వారు వున్నారు . అరబ్ దేశాలన్నీ కలిపి ఒక అరబ్ సామ్రాజ్యంగా ఏర్పడాలని వీరి డిమాండ్ .  అమెరికా సైన్యం  లిబియాలో ఉండటం వల్ల "అరబ్ దేశాలన్నీ కలిసి ఒక్క దేశము అవ్వాలి అన్న కోరిక నెరవేరకుండా వుంది అని వీరు  అసంతృప్తి చెందిన వారు  .  ఇద్రీస్ రాజు గారు తన ఆరోగ్యం కోసమని టర్కీ  దేశము వెళ్ళాడు . అప్పుడు కర్నల్ **Muammar** గడ్డాఫీ అనే అయన ఒక మిలిటరీ తిరుగు బాటు చేసి లిబియా దేశానికి నాయకు డయ్యి  -- లిబియా కు  లిబియన్ అరబిక్ రిపబ్లిక్ అని పేరు పెట్టాడు .

లిబియా దేశము గురించి **{2}** **11-02-24**
కల్నల్ గడాఫీ గురించి **{1}**

**Muammar Gaddafi** అనే మిలిటరీ నాయకుడు   **1 September 1969** న అంతకు మునుపు లిబియాకు రాజు ఐన ఇద్రీస్ పై తిరుగు బాటు చేసి లిబియాలో తన మిలిటరీ ప్రభుత్వం నేలకొల్పాడు .లిబియాలో రాచరిక పాలనని - పాత చట్టాలను రద్దు చేసాడు .దేశం పేరును **Libyan Arab Republic,** గా చేసాడు .ఆతరువాత అనేక సార్లు  తన ఇష్టాన్ని అనుసరించి పలుసార్లు  దేశం పేరును

**Socialist People's Libyan Arab Jamahiriya.**అని **Great Socialist People's Libyan Arab Jamahiriya,** అని మార్చాడు .

ఈ జామహిరియా **Jamahiriya** అనేది కాపిటలిజం కమ్యూనిజం లాగా ఒక సిద్ధాంతము . జామహిరియా అనేక సిద్ధంతాల కలగలుపు . అవి **Arab nationalism,=** అరబ్ దేశాలనే ఒక్కఏలుబడిలో వుండాలని **--** **Nasserism,=** నాసరేన అనే ఈజిప్ట్ నాయకుడు బోధించిన సిదాంతాలు **Anti-imperialism,=** అమెరికన్ సామ్రాజ్యా వాదము **Islamic socialism, left-wing populism African nationalism, Pan-Arabism,**ఇలా అనే క **-** ఇజాలలో వున్నా సిద్ధాంతలు అన్నింటినీ గడాఫీ తన జామహిరియా సిదాంతం లోకి తీసుకు వచ్చాడు . ముస్లింలు అందరూ దేముని వద్దకుమరియూ ఖురానువద్దకు తిరిగి రావాలని **{** అంటే ముస్లిములు ఎవరన్నా వేరే మతంలో ఉంటే వారు తిరిగి ముస్లింలు కావలి అని **}** పిలుపు ఇచ్చాడు . ఇతఃడు తన దేశానికి ఏమి పేర్లు పెట్టినా గానీ చివరికి అది లిబియా ఒక ఇస్లానిక్ దేశం గానే చెలామణీ అయ్యింది . ముస్లింల్లో చాలామంది కావాలి రావాలి అనుకున్న **Salafism** అనే అనే సిద్ధాంతానికి **--** గడాఫీ వ్యతిరేకిగా ఉండి **-** **Salafism** ని ప్రోత్సహించే వారిని జైలు పాలు చేసాడు .

**"Salafiyya"** లేదా **"Salafism "** అంటే ఏమిటంటే **-** ముస్లింలకు మూలమైన మొదటి ముగ్గురు మూల పురుషులు మరియూ వారి సలఫ్ లు అనగా అనుచరులు చెప్పిన పద్ధతులను సాంప్రదాయాలను ముస్లింలు అందరూ అనుసరించాలి అనే వాదము . ముగ్గురిలో మొదట మొహమ్మద్ ప్రవక్త మరియూ అయన అనుచరు లు చెప్పినది

**{2} , Tabi'in** లు చెప్పినది **{** తబియన్లు అనగా మొహ్మద్ ప్రవక్త అనుచరులకు అనుచరులు **} {3} Taba al-Tabi'**యన్లను అనగా ఇస్లాం మతము ద్వారా పరిశుద్ధుత సాధించిన వ్యక్తులు చెప్పినది - ప్రతి ముస్లిమూ ఆచరించాలి అనేదే **"Salafism "** . - ఇట్లా చూసినపుడు సలాఫీసమ్-- ముస్లింలందరూ ఒక ముగ్గురిని తప్ప మరొకరిని ఎవరినీ అనుసరించ పనిలేదని చెపుతున్నట్లు అయ్యింది . అంటే ఇక ముందు వేరే ముస్లిం పెద్దలు ఏర్పడకూడదని కూడా చెప్పినట్లేగా ? అట్లాగే పై ముగ్గురి నే కాక ఆ తరువాత ముస్లిం పెద్దలుగా, నాయకులుగా భావించి ఎవరినీ అనుసరించవద్దు అని చెప్పినట్లు కూడా అయ్యింది కదా ?

అందువల్ల గడాఫీ సలాఫిస్టులను - ముస్లిం ఫండమెంటలిస్టులను జైలు లో పెట్టించాడు . దేశ ఆదాయాన్ని విద్య వైద్య రంగాలకు మళ్లించి దేశాన్ని అభివృద్ధి చేసాడు .ప్రభుత్వ ఉచిత విద్యను బాల బాలికలు అనే తేడా లేకుండా అందరికి సమంగా అందించాడు . కానీ దేశంలోని రాజకీయ వ్యవస్థలను అణగ తొక్కాడు .

ఆ తరువాత గడాఫీ **1980--1990s** ల మధ్య **Eastern Bloc =** అంటే అమెరికాకి వ్యతిరేకంగా రష్యాకి అనుకూలముగా జత కట్టిన దేశాలు మరియూ కుబాకి చెందిన ఫెడరల్ క్యాస్ట్రోకి { ఫెడరల్ క్యాస్ట్రో అమెరికాకి వ్యతిరేకం } తో బహిరంగంగా జత కట్టి - బహిరంగంగా నే పాశ్చాత్య దేశాలను ఎదిరించాడు . ఇది చాలక తన ఇరుగుపొరుగు దేశాలమీదకూడా దాడులు చేసాడు . దీనితో అరబ్ ప్రంపంచంలో ఇతని పేరు క్రమంగా మసక పారసాగింది . ఇతడు ఇరుగు పొరుగు దేశాలమీద దాడులకు తెగపడుతూ ఉండటం వల్ల **1986** లో అమెరికా లిబియా మీద బాంబుల వర్షం కురిపించింది . అప్పుడు గడాఫీ " అమెరికా సామ్రాజ్య వాద దాహానికి వ్యతిరేకంగా ప్రపంచ అరబ్ దేశాలన్నీ ఏకం కావాలని పిలుపు ఇచ్చాడు . నేను అరబ్ సిదాంతాలకు

అనుకూలము అంటూనే గడాఫీ అరబ్ దేశాల మీద కూడా దాడికి దిగుతూ ఉండటం తో ఇతడికి మతి చలించందని అనేక మంది నమ్మారు . ఇంతే కాక తాను రష్యాకు అనుకూలం అంటూనే - అమెరికాకి అనుకూలంగా వున్న దేశాలతో సత్సంభందాలు పెట్టుకుంటూ - అక్కడ వున్న ఆయిల్ కంపెనీలను తమ దేశం ఆహ్వానిస్తూ వుండే వాడు .

**1986** లో అమెరికా లిబియా మీద బాంబుల వర్షం కురిపించింది -

లిబియా దేశము గురించి **{3} 13-02-24**

**1986** లో అమెరికా లిబియా మీద బాంబులు కురిపించటం గురించి **{1}**

ఇంతకు మునుపు ఎపిసోడు లో- **1986** లో అమెరికా లిబియా మీద బాంబుల వర్షం కురిపించింది - అని చెప్పుకున్నాము కదా ? యుద్ధమునకు గల కారణములు గురించి ఈ ఎపిసోడు .

లిబియా కు ఆనుకొని గల్ఫ్ అఫ్ సిడ్రా అనే సముద్ర ప్రాంతము వున్నది . ఇది **275** కిలోమీటర్ల వెడల్పు **150** కిలోమీటర్ల లోతు ఉన్న ప్రాంతము. లిబియా ఈ గల్ఫ్ లోని **115 km** వరకూ విస్తరించి ఉన్న జలాలలో చేపలు పట్టుకుంటున్నది . అంతర్ జాతీయ చట్టాల ప్రకారం, అన్ని దేశాలకు సముద్రములోని **22 km** వరకే తమ దేశపరిధి అని చెప్పుకునే వీలుంది . అది దాటినాక వున్నవి అంతర్ జాతీయ జలాలు. తాము ఎప్పటినుండో చేపలు పట్టుకుంటూ , తమ స్వాదేనంలో ఉంచుకున్న , ఈ **115** కిలోమీటర్లు కాదని

ఎవరన్నా కనుక లోపలకు వచ్చినట్లైతే - వారు మృత్యు ద్వారము దాటి లోనికి వచ్చినట్లే అని గడాఫీ **{1973 లో}** ప్రకటించాడు .

గల్ఫ్ అఫ్ సిడ్రా లో లిబియాకు **115 km** వరకూ లేదని అమెరికా వాదన .ఇట్లాగా **1980** సంవత్సరం నుండీ అమెరికా లిబియా మధ్య సంభందాలు దెబ్బతినటం మొదలైంది . గల్ఫ్ అఫ్ సీద్రాలో ని జలాలు అందరివీ అంటూ అమెరికా విమానాలు గల్ఫ్ అఫ్ సీద్రా లోనికి ప్రవేశించినపుడు - -- గడాఫీ వాటిని కూల్చివేసి - అవి లిబియా పరిధి అయినా **115 km** లోకి చొచ్చుకు వచ్చాయని-- అనగా అమెరికా నేను గీసిన మృత్యు రేఖను దాటి వచ్చింది కాబట్టి , నేను అమెరికా విమానాలపై దాడి చేసి . వాటిని కూల్చి వేసాను " అని గడాఫీ సమర్ధించుకున్నాడు .

ఈ **1986** నాటికి రోనాల్డ్ రీగన్ అమెరికన్ ప్రెసిడెంట్ . అమెరికా కి నేస్తమైన ఇజ్రాయిల్ దేశానికి వ్యతిరేకంగా పోరాడ మని -పాలస్తీనా లిబెరిఃజేషన్ ఆర్గనైజషన్ అనే దానికి కి గడాఫీ సాయం చేస్తున్నాడని , అంతే కాక గడాఫీ అణ్వాయుధాల్ని కూడా తయారు చేసి వున్నాడని - అణ్వాయుధాలతో అరబ్ వాదాన్ని బలపరిచి - ప్రపంచంలోని అరబ్ దేశాలన్నింటినీ ఒక్కటి చేయాలని గడాఫీభావిస్తూ వున్నదని - ఆంతే కాక అమేరికా సి ఐ ఏ లో పని చేసి విరమణ పొందిన ఉద్యోగులందరినీ కూడదీసి ఒక రహస్య సంస్థను ఏర్పాటు చేస్తున్నాడని - రోనాల్డు రీగనుకు నివేదికలు అందాయి .

చాడ్ అనే చిన్న దేశము వున్నది . ఇక్కడ యురేనియం నిల్వలు వున్నవి - యురేనియం అణ్వాయుధాల్ని తయారు చేయటానికి వాడతారు . ఆదేశానికి కెనడా మరియూ ఫ్రాన్స్ కలిసి రక్షణ సహాయాలను చేస్తుంటాయి . గడాఫీ వెళ్లి ఆ "చాడ్" దేశాన్ని ఆక్రమించుకోవాలి అనుకున్నాడు . ఎందుకయి ఉంటుంది **?** అంటే

యురేనియం కోసమే కదా ?అణ్వస్త్రాల కోసమే కదా ? దీనితో రెగన్ అప్రమత్తము అయ్యారు .

ఇవే కాక -- ఈ పాటికే, గడాఫీ **Red Army** ఫ్యాక్షన్**{** వెస్ట్ జెర్మనీ లోఉన్న తీవ్రవాద సమస్త **} , the Red Brigades,{** ఇట్లలీలోని ఒక ఉగ్రవాద సమస్త **} and the Irish Republican Army {** ఐర్లాండులోని ఒక ఉగ్రవాద సమస్త **}** లాంటివాటికి ఆర్ధిక సాయాలు అందిస్తూ **-** అమెరికా తనను అణిచివేసే ధోరణి ని మానుకోక పోతే ఈ సాయాలు మరింతగా కొనసాగిస్తాను అని అమెరికాని హెచ్చరించాడు **.**

పై కారణాలతో **15 April 1986** న యుద్ధము మొదలైంది. దీని కన్నా ముందు అనగా **5 April 1986,** న లిబియాకు చెందిన రహస్య గూఢచారులు కొందరు , వెస్ట్ జర్మనీలోని ఒక డిస్కో థెక్ పై బాంబు దాడి చేయించాబు **.** ఈ డిస్కో థెక్ కి అమెరికన్ సైనికులు తమ సరదా కోసం తరచూ వస్తూ వుంటారు **-** ఈ అమెరికన్లను లక్ష్యం గా చేసుకునే బాంబు దాడి జరిగింది **.** ఈ దాడిలో ఇద్దరు అమెరికన్ సైనికులుమరణించగా **79** మంది అమెరికన్లు గాయపడ్డారు **.** చూడగా చూడగా లిబియాకి అమెరికా అంటే భయము భక్తీ లేకుండా పోయినట్లు కనపడింది **.**

లిబియా దేశము గురించి **{4} 17-02-24**

**1986** లిబియా యుద్ధము గురించి **{2}**

యుద్ధము మొదలు పెట్టటానికి గానూ వెళ్ళవలసిన అమెరికా యుద్ధ విమానాలు **-** తమ దేశం మీదగా ఎగిరి వెళ్ళటానికి **-** ఫ్రాన్స్ , స్పెయిన్ మరియూ ఇటలీ దేశాలు ఒప్పుకోలేదు **.** ఇటలీ ఎందుకు ఒప్పుకోలేదు అన్నది నింపాదిగా తెలుస్తుంది **.** దీనితో , ప్రతి అమెరికా యుద్ధ

విమానము 2100 కిలోమీటర్లు అదనంగా - వేరే మార్గము ద్వారా ఎగర వెలిసి వచ్చింది . ఇప్పుడు తనకు ఉన్న యుద్ధ విమానాల సామర్ధ్యాన్ని పెంచుకోవాల్సిన అవసరంఅమెరికా గుర్తించి మరిన్ని మెరుగైన ఆయుధాల- విమానాల రూపకల్పనకు దిగింది .

లిబియాపై అమెరికా ఇరవై నిమిషాలలో 60 టన్నుల బాంబులు వదిలింది . అంతర్జాతీయ ఒప్పందాల ప్రకారము ముందు హెచ్చరిక చేయకుండా బాంబులు వేయకూడదు .అందువల్ల సాధారణ ప్రజలు మరణిస్తారు అని . కానీ అమెరికా కొన్ని లక్ష్యాలు గుర్తించి వాటిపై బాంబులు వేసింది . అమెరికా లక్షాలు జనం మీద కాదు కాబట్టి -ఒక బాంబు వెళ్లి జనం మీద పడితే అది అమెరికా తప్పు కాదు - లక్ష్యం చేరుకోలేని బాంబులదే తప్పు . ఇట్లా కూడా మనము పాప ప్రక్షాళన చేసుకోవచ్చు .

మధ్య మధ్య కొన్ని అదనపు విషయాలు తెలుసుకోవాలి అనుకుంటూ వున్నాము కదా ? ఈ యుద్ధములో అమెరికా **GBU-10 Paveway - II** అనే స్మార్ట్ బాంబులు వాడింది . పేవ్-- వే అంటే దారిని ఏర్పరుచుకుని ముందుకు పోవటం అని. ఈ బాంబు ఒక లేజర్ బీమ్ ద్వారా, ముందుగామ్యాపులో చూపిన టార్గెట్ ను గుర్తు పట్టి ఆ కాంతి రేఖ అనుసరించి వెళ్లి టార్గెట్ మీద పడుతుంది .ఇలాంటి బాంబులు తప్ప మిగతా బాంబులు పోయి లిబియా రాజధాని ట్రిపోలి లో ఇష్టారాజ్యముగా పడ్డాయి . కాబట్టి అమెరికా బాంబుల వర్షం కురిపించింది అన్నారు .

ఇరవై నిమిషాల పాటు కురిసిన బాంబుల వర్షంలో లిబియా అచేతనం అయ్యింది . ఏది ఏమిటో ఏమి చేయాలో లిబియా మిలటరీ వారికి అర్ధం కాలేదు . వారి రాడార్ సిగ్నల్స్ అన్నీ జామ్ అయి వున్నాయి . లిబియా రెండు గంటల తరువాత స్పందించగలిగి , అమెరికా మీద ఎదురు దాడికి దిగి నా గానీ , ఏమీ చేయలేక పోయింది . అమెరికా తన దాడిని ముగించుకొని - తన యుద్ధ విమానాలను సముద్ర జలాలలో ఉన్న తన ఓడల మీదకు ఎక్కించుకొని వెనక్కి మళ్లింది .

ఈ దాడిలో గడాఫీ ని చంపాలి అన్నదే అమెరికా ఉద్దేశ్యము . చనిపోయే ఉంటాడు అనికూడా అమెరికా అనుకున్నది . కానీ అమెరికా -- లిబియా మీద దాడి చేయబోతూ వున్నదని -గడాఫీకి ముందస్తు సమాచారం అందింది . ఆయన తప్పించుకున్నాడు . తన నివాసం నుండి వేరే చోటకి మారాడు . ఈ సమాచారాన్ని లిబియాకి **333 KM** ఆవల ఉన్న మాల్టా దేశ ప్రధానమంత్రి-- గడాఫీ కి అందించాడు . ఈయనకు ఇటలీ దేశమునుండి ఆ సమాచారం అందింది . లిబియాని కాపాడాలి అన్న దురద ఇటలీ కి ఎందుకు? అంటే ? ఈ లిబియా గురించి చెప్పుకొనటం మొదలెట్టినపుడే - తెలుసుకున్నాము- పూర్వపు రోమనులు లిబియా ప్రాంతాన్ని ఆక్రమించుకొని లిబియాలో రాజరిక పాలన ను మొదటిగా స్థాపించారు అని . అనగా పూర్వ చెరిత్ర ప్రకారము లిబియా రోమను సామ్రాజ్యములో ఒకనాటి దేశము . గతకాలపు రోము సామ్రాజ్యము లో భాగముగా వుంది - ప్రస్తుతం వేరే గా వున్నా దేశాలన్నింటినీ మరలా కలుపుకొని - చెరిత్రలో పేర్కొన్న పాత రోమను సామ్రాజ్యాన్ని ఏర్పాటు చేయాలని ఇటలీకి ఒక ఉద్దేశ్యము వున్నది . అందువలన అది లిబియాని నాశనం అయిపోనివ్వ దలుచుకోలేదు . లిబియా ఆయిల్ ఇటలీకి దక్కితే ఇటలీకి మంచిది కదా ? ఇందు వల్ల ఇటలీ అమెరికా దాడి సమాచారాన్ని లిబియాకు కొంచెం ముందుగా అందేటట్లు చేసింది .

అమేరికా విమానాలు తమ దేశం మీదగా ఎగిరి వెళ్ళటానికి గానూ - ఫ్రాన్స్ స్పెయిన్ మరియూ ఇటలీ దేశాలు ఒప్పుకోలేదు అని ఇంతకు ముందే చెప్పుకున్నాము కదా ? . ఇలా చూసినపుడు మీ గగన తలంమీదగా ఎగరటానికి మాకు అవకాశం ఇమ్మని - ఇటలీని , అమెరికా అడిగిందని - ఆరకంగా అమెరికా, లిబియా పై దాడి చేయనున్నదని ఇట్లలీకి ముందుగా తెలిసి పోయింది అన్నారు .

సమాచార సేకరణ విశ్లేషణ రచన వారణాసి శ్రీ రామ కృష్ణ అమరావతి

లిబియా దేశము గురించి {5}          18-02-24

**1986** లిబియా యుద్ధము గురించి {3}

" లిబియాలో అమెరికా వేసిన బాంబుల వల్ల - సైనికులతో కలుపుకొని **60** మంది వరకూ మరణించారు .  ఈ చనిపోయిన వారిలో ఒక చిన్న బాలిక వున్నది ఆపిల్ల గడాఫీకి దత్త పుత్రిక అని వార్తలు ప్రసారం అయినాయి  . ఆపిల్ల శవాన్ని అమెరికన్ విలేఖరులకు చూపించారు .

శవరాజకీయం **=?** గడాఫీకి నిజంగా ఒక దత్త పుత్రిక వున్నది . ఆమె ఎప్పుడో చని పోయింది .ఎప్పుడో  చనిపోయిన పిల్ల స్థానములో - ఇప్పుడొక అనాధ పిల్ల శవాన్ని పెట్టి అదే గడాఫీ పెంపుడు కూతురు శవము అని లిబియా చేపుతున్నదని అమెరికా అన్నది .--oo--

ఈ యుద్ధములో మేము రెండు  అమెరికన్ విమానాలు కూల్చాము అని లిబియా అన్నది ." కాదు - మా విమానాలు సరిఅయిన రేడార్ సిగ్నల్స్ అందక సముద్రములో కూలినాయని అమెరికా అన్నది . అమెరికా వాటి కోసం వెతక లేదు .

చివరికి తమ యుద్ధ విమానము ఒకటి లెక్క తేలలేదని అమెరికా ఒప్పుకున్నది  .

**25 December 1988,** న గడాఫీ - ఒక అమెరికన్ సైనికునికి మృత దేహాన్ని - "జాన్ పోపు పాల్"  ద్వారా అమెరికాకి

అందచేస్తాను అని ప్రతిపాదన చేసాడు .అమెరికా దాన్ని తీసుకొని " ఎప్పుడో **1986** లోకూల్చబడిన విమానం నుండి దొరకిన అమెరికన్ సైనికుని మృత దేహాన్ని ఇన్నాళ్లూ కోల్డ్ స్టోరేజీలో పెట్టి ఇప్పుడు అమెరికాకి ఇస్తున్నాము అని అమెరికాఅన్నది . .కానీ మృతుని బంధువులు మాత్రము " కాదు కాదు లిబియాలో చిక్కుకు పోయిన మావాడిని బందీగా ఉంచుకొని - అతడు చనిపోయినాక మాకు అప్పచెపుతున్నారు " అని ప్రకటించారు. లిబియాలో చిక్కుకు పోయి మృతి చెందిన తన దేశ సైనికుని కోసం అమెరికా ఏమీ చేయలేనిది అయింది అనటానికి వీలైంది కదా ? దీనితో తాను అమెరికాను దెబ్బకొట్టాను అని చెప్పుకోవటానికి లిబియా గడాఫీకి వీలు దొరికింది . **1986** లో అమెరికా పై తన విజయానికి గుర్తు అంటూ - గడాఫీ లిబియా పేరును మరొక్కసారి మార్చి - **"Great Socialist People's Libyan Arab** జామహిరియహ్ " అని పెడుతున్నట్లు ప్రకటించాడు . ఇట్లగా పేరు మార్చితే ప్రయోజనాలు ఏమిటి అంటే ? లిబియా యొక్క మారిన పేరును ఏ ఏ దేశాలు అయితే గుర్తిస్తాయో - ఆ దేశాలన్నీ కూడా - లిబియా చేతుల్లో అమెరికా ఓడిపోయినట్లు గా గుర్తించి నట్లే కదా ? ఇంతే కాక లిబియా పోస్ట్ ఆఫీస్ వారు **1986** లో అమెరికా పై లిబియా విజయాలను చూపించే ఫోటోలు కల పోస్టల్ స్టాంపులను విడుదల చేశారు . ఇట్లాంటప్పుడు ఏమవుతుందంటే - ఈ పోస్టల్ స్టాంప్ ఏ ఏ దేశాలు పెడుతుందో ఆ ఆ దేశ ప్రజలు- అమెరికా పై లిబియా విజయం సాధించిందని గట్టిగా నే నమ్ముతారు . స్టాంపులు లోని చిత్రాల దృశ్యాల ద్వారా -అమెరికాని చిన్న చూపు చూస్తారు , పోస్టలు స్టాంపులు సేకరించే వారి వద్ద ఇవి వందల సంవత్సరాల పాటూ ఉండి -లిబియా చెప్పుకుంటున్న విజయాన్ని చరిత్రలో

మరుగున పడకుండా చూస్తాయి . స్టాంపుల విడుదల **1986** నుండి **2001** వరకూ జరిగి- మరింత అవమానాన్ని అమెరికాకి అంతకడుతూ ఉన్నవి . ఇలా చేసి లిబియా ప్రతీకారం తీర్చుకుంది. రొండు దేశాల మధ్యా శత్రుత్వాలు పెరిగాయి . **--00--**

**5 September 1986,** న పాకిస్తానుతో అమెరికాకు చెందిన పాన్ అమెరికా మానము హైజాక్ అయ్యింది . దానిలో ఇరపై మంది మరణించారు . ఈ సంఘటన వెనుక లిబియా యొక్క హస్తము వున్నదని **2004 -** మార్చ్ లో బయటపడింది . **--00--**

**October 1986,**లో గడాఫీ అమెరికాలో ని ఉన్న **Chicago Black P. Stones gang,** అనే గ్యాంగ్ స్టర్ సంస్థకు ఆర్థిక సాయా లు అందించి - అమెరికా నేలమీదనే అమెరికాకి శత్రువులను తయారు చేసే ప్రయత్నం చేసాడు . " లిబియా పెట్టు బడీతో అమెరికా పై తిరగబడ్డ వారీగా పేర్కొంటూ - అమెరికా కోర్టులు ఈ గ్యాంగ్స్టర్స్ ని శిక్షించాయి .

**--00--**

" అమెరికన్ ప్రెసిడెంట్ నామీద హత్యా ప్రయత్నాలు చేయిస్తూ వున్నాడు " అని గడఫీ చెప్పుకో సాగాడు . అమెరికా వరల్డ్ పోలీస్ అయిందని విమర్శించాడు .

సేకరణ సమర్పణ వారణాసి శ్రీ రామ కృష్ణ అమరావతి .

ఇష్టం కలిగించుకొని చరిత్రను చదవటం మొదలెడితే అది డిటెక్టివ్ నవలకన్నా రుచిగా ఉంటుంది .

లిబియా దేశము గురించి **{6}** **21-02-24**

గడాఫీ పై హత్యా ప్రయత్నం **{1}**

" అమెరికన్ ప్రెసిడెంట్ నామీద హత్యా ప్రయత్నాలు చేయిస్తూ వున్నాడు " అని గడఫీ చెప్పుకో సాగాడు . అమెరికా వరల్డ్ పోలీస్ అయిందని విమర్శించాడు .

లిబియాలోని - ఫండమెంటలిస్టులు , అనగా ముస్లిం మూలలలోకి వెళ్ళాలి అనే ఉగ్రవాద సంస్థలు, **February, 1996,** న గడాఫీని లక్ష్యంగా చేసుకొని రోడ్డుకింద బాంబులు పెట్టాయి . గడాఫీ తప్పించుకున్నాడు .

**9 March 1996** న కూడా గడాఫీ మీద ఒక హత్య ప్రయత్నం జరిగింది . గడాఫీ లిబియా రాజధాని ట్రిపోలికీ **370** కిలోమీటర్ల దూరంలో ఉన్న " సిర్త్ " అనే పోర్ట్ పట్టణాన్ని సందర్శించినపుడు ఈ హత్యా ప్రయత్నం జరిగింది .గడాఫీ సెక్యూరిటీ గార్డులు మరణించారు .

**"Al Jamaa Islamiya al Muqatila"** అనే సంస్థ ఈ హత్యాప్రయత్నానికి భాద్యత తీసుకున్నది . ఈ సంస్థ అధ్యక్షుడు - **Abdul Mohaiman** ఆఫ్గనిస్తానులోని గెరిల్లా యుద్ధ పోరాటాలలో పాల్గొని వచ్చిన అనుభవం వున్న వాడు . లిబియా సైనికులు **Abdul Mohaiman** హోమ్ టౌన్ అయిన **Ajdabiya,** అనే పట్టణాన్ని తమ గుప్పిటలో బిగియపెట్టి - **Abdul Mohaiman** ఎక్కడ వున్నాడో చెప్పాలని సాధారణ ప్రజలను కూడా నిర్బంధ పెట్టాయి .

గడాఫీ తన మీద హత్యా ప్రయత్నానికి భాద్యులు గా పేర్కొంటూ ఆరుగురు సీనియర్ మిలిటరీ ఆఫీసర్స్ ని ఇద్దరు పౌరులను - **1997** లో చంపి వేశాడు . ఇలాగా చంపివేయ పడ్డ వారిలో - **1993** నుండీ అమెరికాకు రహస్య సమాచారం చేరవేస్తూ వున్నాడన్న అభియోగాలు ఎదుర్కుంటున్న మిలిటరీ అధికారి కూడా వున్నాడు . అంటే అమెరికాకి నష్టం జరిగింది .

**The National Front for the Salvation of Libya (NFSL)** అనే సంస్థ , **1981** నుండీ గడాఫీ మీద తిరుగు బాటు చేస్తునే వున్నది .ఈ గ్రూప్ లిబియాలో ప్రజా స్వామ్య ఎన్నికలు జరగాలని - పత్రికా స్వేచ్ఛ ఉండాలని - పాలనా అధికారాలు వికేంద్రీకరించబడాలి అని డిమాండ్ చేసింది . ఈ సంస్థ నేక సార్లు గడాఫీ పై తిరుగుబాటు పోరాటం జరిపి - ఆ పోరాటాలు విఫలమైనాక , సుడాన్ వెళ్లి అక్కడ నుండి తన కార్యక్రమాలు నడపటం . **2005** నాటికి ఈ సంస్థ - తన లాంటి వారే అయిన మరి ఇతర ఆరు గ్రూప్ లతో జతకట్టి **NFSL** అనే సంస్థ ను ఏర్పాటు చేసింది . **NFSL** సంస్థ సొంత రేడియో స్టేషన్ ను, మిలిటరీ శిక్షణా కేంద్రాన్ని కలిగి వుంది . ఈ సంస్థ ని సౌదీ అరేబియా మరియూ అమెరికా కలిసి ప్రోత్సహించాయి .

**NFSL** కల్పించిన పరిస్థితుల వల్ల **2011** - లిబియా సివిల్ వార్ అనేది మొదలైంది . **<<{** నేను వ్రాసిన ఈ వ్యాసాలు చదివిన వారిలో ఒకరు - **2011** - లో తాను లిబియాలో వున్నానని - లిబియా నుండి ఇండియాకి వచ్చిన మొదటి విమానంలో తాను వున్నానని తెలిపారు . - అనగా నా వ్యాసాలు కొందరిని గతం గుర్తు చేసుకునేలా చేసింది అని సంతోషించాను **}** **>>**

**2011** లో లిబియాలో మొదటి ప్రజా తిరుగు బాటు జరిగింది . గుడాఫీని అధికారం నుండి దింపటానికి ఆ దేశములోని సాయుధ తిరుగు బాటు సంస్థలు **NFSL** సంస్థ పూనుకున్నాయి . గడాఫీ మిలటరీ వీరిమీదకు విరుచుకు పడింది .

ఈ దాడులను ఉద్దేశించి - **February 2011,** లో గడాఫీ " ఇంటింటిలో , గది గదిలో, మూల మూలల్లో దాగిన బొద్దింకలను , ఎలుకలను బయటికి రప్పించి వాటిని మట్టు పెట్టటానికి తన దళాలు కట్టు బడి ఉన్నాయని - ఓ

బహిరంగ ప్రకటన చేసాడు . దీని ఆధారంగా గడాఫీచేతిలోని మిలిటరీ వారు సాధారణ ప్రజలపై క్రూరాతి క్రూరపు దాడులు చేసి జనాన్ని చంపివేశారు . ఇలాంటప్పుడు ప్రజలలోని కొందరు తమకు వ్యక్తి గతంగా గిట్టని వారి పై ఉగ్రవాదిముద్ర వేసి ప్రభుత్వానికి సమా చారము అందిస్తారు . ఇందులో న్యాయము జరిగిందా ? అన్యాయం జరిగిందా ? అనేది ప్రజలు గ్రహించుకుంటూ నే వుంటారు . అన్యాయము జరిగినపుడు - న్యాయము జరగాలని సాధారణ ప్రజలు కూడా తిరగ పడతారు . ఇది దేముడు విశ్వవ్యాపితముగా వున్న మానవులకు ఇచ్చిన తత్వము దీనిని అడ్డుకోలేకనే సామ్రాజ్యాలు కూలి పోతాయి .

సాధారణ ప్రజలు కూడా తిరగ బడటంతో - లిబియా అంతా అల్లకల్లోలం అయ్యింది . గడాఫీని వ్యతిరేకించే వారంతా కలిసి **"The National Transitional Council."** అనే ఒక సంస్థ ని పెట్టారు . ఈ కౌన్సిల్ గడాఫీని కూలద్రోసి --- ఒక ఫది నెలల పాటు తన పాలన సాగించి , ఆపై లిబియాలో ఎన్నికలు జరిపి, **7 July 2012,** న ప్రజా ప్రభుత్వంఏర్పరిచింది . ఎన్నిక కాబడిన ప్రజా ప్రతినిధుల ద్వారా లిబియాలో ప్రజా ప్రభుత్వము ఏర్పాటు అయింది . వీరు కూడా దేశము పేరును మర్చి- సింపులు గా ముందూ వెనకా ఏమీ లేకుండా " లిబియా " అని పేరు పెట్టారు . లిబియా ప్రజా ప్రభుత్వానికి అమెరికా మద్దత్తు - యునైటెడ్ నేషన్స్ గుర్తింపు దక్కాయి . ఇది దేశాలు అందులోని ప్రభుత్వాలు బ్రతకటానికి ఆక్సిజన్ వంటిది .

తరువాత ఎపిసోడులో గడాఫీ పతనం మరియు మరణం గురించి ఉంటుంది.

సేకరణ సమర్పణ వారణాసి శ్రీ రామ కృష్ణ అమరావతి

లిబియా దేశము గురించి **{7} 25-02-24**

గడాఫీ మరణం గురించి **{1}**

లిబియా ప్రజా ప్రభుత్వానికి అమెరికా మద్దత్తు - యునైటెడ్ నేషన్స్ గుర్తింపు దక్కాయి . ప్రపంచ శాంతిని కాపాడటానికి యునైటెడ్ నేషన్స్ ఆర్గనైజషన్ అనేది ఏర్పడి వుంది కదా ? అందువల్ల 2011 లిబియన్ సివిల్ వార్ లో దెబ్బతిన్న శాంతి భద్రతలు కాపాడవల్సి న వారు కూడా యూ యెన్ వారే అయినారు . కాబట్టి లిలియాలోకి యూ యెన్ సంకీర్ణ మిలటరీ దళాలు ప్రవేశించాలని - అవి గడాఫీ ప్రోత్సాహంతో లిబియాలో జరుగుతున్న సాయుధ తిరుగు బాట్లను అణిచి వేసి శాంతి నెలకొల్పాలి అంటూ యూ ఎన్ ఒక తీర్మానం చేసింది . ఇంతేకాక యూ యెన్ బలగాలు తప్ప వేరే ఎవరూ లిబియా గగన తలం లోకి ప్రవేశించకుండా నిషేధం కూడా విధించారు . లిబియాని దాని పొరుగు అరబ్ దేశాలు ఆక్రమించుకోకుండా ఇది ముందు జాగర్త చర్య లాంటిది అన్న మాట .

లిబియా కూడా యూ ఎన్ లో ససభ్య దేశము అయ్యింది , కాబట్టి ఈ తీర్మానాన్ని లిబియా కూడా ఆమోదించింది . ఇండియా - చైనా రష్యా ఫ్రాన్స్ జెర్మనీ యూకే వంటి దేశాలు కూడా ఈ తీర్మానాన్ని ఆమోదించాయి . ఈ తీర్మానం వల్ల గడాఫీకి సొంత దేశంలోనూ బయటి దేశాలనుండీ కూడా వచ్చే మిలటరీ సపోర్ట్ తగ్గి పోయింది .

ఆపరేషన్ యూ ఎన్ ప్రొటెక్టర్ అన్న పేరుతో నాటో బలగాలు లిబియాలో దిగాయి . ఈ దళాలకు గడాఫీ మిలటరీకి మధ్య యుద్ధము నడిచింది . గడాఫీ ఒక్కో పట్టణము మీద తన పట్టు కోల్పోతూ - చివరికి దేశ రాజధాని అయినా ట్రిపోలీ పట్టణం గూడా చేజార్చుకొని-- దాన్ని వదిలి పారిపోయాడు. తాను పోతున్న చోటుకు కాక వేరేచోటుకు పోతున్నట్లు భ్రమ కల్పించి, "సిర్త్ " అనే పట్టణము పోయాడు - "సిర్త్ "గడాఫీ పుట్టిన పట్టణము . అక్కడ అతనికి ఎందరో నమ్మిన బంట్లు రక్త సంబంధీకులు బాల్య స్నేహితులూ వున్నారు . ఇంతే కాక "సిర్త్ "పట్టణంలో ఎక్కువగా ఇటాలియన్ జాతి వారు వుంటారు . ఈ పట్టణం 1911 తరువాత కొంత కాలం పాటు ఇటలీ వారి ఏలుబడిలో వుంది. అందువల్ల ఇక్కడ ఇటలీ జనం ఎక్కువ . ఇటలీ ఇంతకు ముందు గడాఫీని కాపాడింది అన్నది గుర్తుందా ? సిర్తు పట్టణం మీదా -- అక్కడి ఇటాలియాన్ ప్రజల మీద ప్రేమతో - ఇటలీ తనకు ఏదన్న సాయం అందించవచ్చన్న ఊహతో గడాఫీ అక్కడికి చేరుకున్నాడు . గడాఫీ తో పాటు అతని కొడుకు కూడా సిర్టు పట్టణం

చేరుకున్నాడు . సిర్టు సగానికి పైగా పాడు పడిన పట్టణము .ఎక్కువ ఎడారి గల ప్రాంతము . గడాఫీ ఎలుకలాగా , బొద్దింకలాగా ఆ పాడుబడిన భవనాల మధ్య దాక్కుంటూ తిరిగాడు తూ వున్నాడు .

20 అక్టోబర్ 2011 న గడాఫీని చంపి వేయబడతాడు అనగా - ఆ ముందు రోజు 19 October 2011, న, లిబియా ప్రధాన మంత్రి Mahmoud జిబ్రిల్ ఒక ప్రకటన చేస్తూ గిడఫీ సిర్తు ప్రాంతం లో ని ఒక ఎడారి లోదాక్కొని ఉండి తన ప్రభుత్వాన్ని తిరిగి నెలకొల్పటానికి పరాయత్నిస్తూ వున్నాడని ప్రకటించాడు .

అప్పటికి యూ యెన్ మిలటరీ దళాలు సిర్త్ పట్టణాన్ని స్వాధీనం చేసుకొని గడాఫీ కోసం వెతుకుతూ వున్నాయి . తన ఉనికి బయట పడటంతో, గడాఫీ ఎడారి మార్గం ద్వారా దేశం వదిలి పారిపోవటానికి ఓ 75 వాహనాలు కల ఒక కాన్వాయ్ తో ఎడారి ని దాట సాగాడు . " నీ కారణంగా దేశం లో విద్యుత్ నీరు వంటివి లేక ప్రజలు నీమీద తిరగ పడేట్లు వున్నారు . నీవు పారిపో " అంటూ కొందరు ముఖ్య అనుచరులే గడాఫీకి పారిపొమ్మని సూచన చేశారు . అందుకని గడాఫీ మరలా ప్రభుత్వం స్థాపించే ఉద్దేశ్యము విరమించుకొని - పలాయనం బాట పట్టాడు.

ఎడారికుండా పోతున్న వాహనశ్రేణినిని ని - గగన తలంలో పహారా తిరుగుతూ వున్న ఇంగ్లాండ్ విమానము గుర్తించింది . గడాఫీ ఎవరితోనో సెటిలైట్ ఫోనులో మాట్లాడుతుండగా ఆ గొంతు విన్న అమెరికా -- ఆ వాహనశ్రేణిలో వున్నది అతడేనని నిర్ధారించింది . ఆ వెంటనే అమెరికా తన లాస్ వేగాస్ బేస్ నుండి ఓ డ్రోను ను ప్రయోగించి వాహన శ్రేణిలోని 21 వాహనాలను నాశనం చేసింది . తరువాత ఫ్రెంచ్ విమానాలు వచ్చి ఇంకొన్ని బాంబులు వేసాయి . ఇప్పుడు లిబియా దేశపు దళాలు వచ్చి వాహనాలను అడ్డుకున్నాయి . నాటో రూల్సు ప్రకారము విమాన దాడులు మిలటరీ లక్ష్యాల మీదనే జరగాలి గానీ వ్యక్తులనుద్దేశించి జరుగకూడదు . అందుకని అతన్ని పట్టుకునే పని లిబియా సైనికులకు వదిలి వేశారు . గడాఫీ వెంట వస్తున్న అనుచరులలో 100 మంది వరకూ చనిపోయారు . వీరిలో ప్రజా వ్యతిరేకులుగా గుర్తించిన వారిని లిబియా దళాలు కాల్చి చంపాయి . ఇదంతా Misrata అనే పట్టణ పొలిమేరల కుండా గడాఫీ వెడుతున్నపుడు జరిగింది . ఈ Misrata పట్టణంలో - గడాఫీకి బద్ధ వ్యతిరేకంగా పనిచేసే త్రీవ్రవాదులు వున్నారు . వారు కూడా వచ్చి ఈ దాడులలో

పాల్గొన్నారు .వీరే గడాఫీ నమ్మిన బంట్లను గుర్తించి మరీ చంపారు . గడాఫీకూడా వీరికే చిక్కాడు .

తన వాహనము నాశనం కాగానే గడాఫీ తన కుమారునితో పాటుగా వెళ్లి దగ్గరలో వున్నా ఒక ఇంటిలోకి దూరాడు . ఆ తరువాత గడాఫీ కొడుకు - ధ్వంసం కాకుండా వున్నా వాహనాలను పరిశీలించి వస్తానని బయటికి పోయాడు . ఈ లోపు లిబియా దళాలు గడాఫీ దాక్కున్న ఇంటిపైపు రాసాగాయి . గడాఫీ అనుచరులు వారిపై బాంబు విసిరారు . ఆ బాంబు ఒక గోడకు తగిలి వెనక్కి వచ్చి పడి గడాఫీ అనుచరులనే పేల్చి వేసింది .చివరికి గడాఫీ వెళ్లి పొలాల కుండా పోతూ వున్న ఒక డ్రైనేజీ పైపు లో దాక్కున్నాడు. ఈ ప్రాంతము గురించి బాగా తెలిసిన వారు **Misrata** త్రీవ్రవాదులే .. వాబు ఈ డ్రైనేజీ పైపులను వెతికారు .గడాఫీని గుర్తించారు . ఈ సమాచారం తెలిసి - "ఎలుక కన్నంలో దూరిందని" అమెరికా అన్నది .

లిబియా దళాలు తమను సమీపిస్తూ ఉండగా గడాఫీ అనుచరుడు ఒకడు గడాఫీ మీద కాల్పులు జరిపాడు . గడాఫీని ప్రాణాలతో దొరకనివ్వకూడదని అతని ఉద్దేశ్యము . కాలి గాయం తో ఉన్న గడాఫీని **Misrata** త్రీవ్రవాదులు డ్రైనేజీ పైప్ నుండి బయటికి లాక్కొచ్చాయి .

ఈ దళాలుగడాఫీని మామూలుగా చంపలేదు . అవి గడాఫీని ఎలాచంపాయి అన్నది **next** ఎపిసోడులో .రాసి అంతటితో ముగిస్తాను .

సమాచార సేకరణ వివరణ వ్యాఖ్యానము వారణాసి శ్రీ రామ కృష్ణ అమరావతి

**లిబియా దేశము గురించి {8}** **29-02-24**

**గడాఫీ మరణం గురించి {2}**

గడాఫీని లిబియా **NTC** దళాలు గడాఫీని ఎలాచంపాయి అన్నది ఈ ఎపిసోడులో ని విషయము .

గడాఫీని పట్టుకున్న సైనిక దళాలు గడాఫీ  గాయాలతో మరణించాడు అని చెప్పాయి.  కానీ గడాఫీకి బద్ద వ్యతిరేకులైన **Misrata**-మిలిటెంట్లు , గడాఫీని- అతడి అనుచరులను  బందించి  వారిని  చిత్ర హింసలు పెడుతూ చంపినట్లు కొన్ని  వీడియోలు బయటికి వచ్చాయి .  ఆ వీడియోలలోని  ఒక వీడియోలో  ఒక సైనికుడు గడాఫీ మల ద్వారంలోకి ఒక తుపాకీని దూర్చి కాల్పులు జరిపినట్లు దానితో  గడాఫీ మరణించినట్లు ఆ కనపడుతూ  వున్నది . ఇలాంటివి అన్నీ ఆటవిక శిక్షలు .**{** మనకు గూడా పూర్వకాలం లో కొరత వేయటం అనగా సన్నని మొన ఉన్న వెదురు  స్తంభం మీద మనిషిని కూర్చోపెట్టి ఆ వెదురుబొంగు అతని తలలో నుండి బయటకు వచ్చేట్లు చేయటం అనే శిక్ష వుండేది అని చదివాను **}**  గడాఫీని  చంపి ఆ తరువాత - మల ద్వారం  కుండా కాల్చారా లేక బ్రతికి ఉండగానే అలా చేశారా అన్న సందేహం పుట్టింది .   ఏది ఏమైనా గడాఫీ ఒక ఆటవిక శిక్షకు గురి ఐ  అమానవీయంగా మరణించాడని **-Amnesty International** మరియూ  **Human Rights Watch** అనే సంస్థలు అన్నాయి . ఈ సంస్థలు  కలుగ చేసుకొని - గడాఫీ శవానికి పోస్ట్ మార్టం  చేయాలని కోరాయి. కానీలిబియా ప్రభుత్వము  తనకు దొరికిన వీడియోల మీద ఏమీ చెర్యలు తీసుకోలేదు .

**-Amnesty International** మరియూ  **Human Rights Watch** అనే సంస్థలు  - గడాఫీ శవానికి పోస్ట్ మార్టం  చేయాలని కోరాయి.  వీరి ఒత్తిడితో చివరికి గడాఫీ శవాన్ని  పోస్టుమార్టం చేయించి  తలకు తగిలిన తుపాకీ గుండు కారణంగాఅతడు మరణించాడని చెప్పారు .

.

గడాఫీ శవాన్ని కొన్ని రోజుల పాటు అట్లాగే ఉంచి " అతడు నిజంగానే చచ్చాడు " అని  నిర్ధారించుకోవటానికి  "ప్రతి ఒక్క రికి  అవకాశం

కల్పిస్తున్నాము" అని దేశ నాయకులు ఒక ప్రకటన చేశారు .దీని కోసము అని **24 October.**వరకూ గడాఫీ మృత దేహాన్ని ఒక పబ్లిక్ ఫ్రిజ్ లో ఉంచారు

పబ్లిక్ ఫ్రిజ్ అంటే - ? మన దేశంలో ని దాతలు గుడులలోవాటర్ కూలర్ల ను పెట్టినట్లు , ఈ ఆఫ్రికన్ దేశాల్లో ని దాతలు నడి వీధుల్లో "పబ్లిక్ ఫ్రిజ్లు" అనేవి ఏర్పాటు చేస్తారు . సంపన్నులు తమ ఇంట్లో మిగిలిన ఆహార పదార్ధాలను తెచ్చి ఈ ఫ్రిజ్ లో పెడతారు - తిండికి గతిలేని - పేదలు వాటిని తీసుకు వెళ్లి తింటూ వుంటారు . అదీ పబ్లిక్ ఫ్రిజ్ లోని ఉద్దేశ్యము . ఈ ఫ్రిజులు ఎంత పెద్దవిగా ఉంటాయంటే వాటి కెపాసిటీవేల లీటర్ల లో ఉంటుంది . పెద్ద పెద్ద పరిశ్రమలు తమ ప్రొడక్ట్స్ ని శీతలీకరించటానికి వీటిని వాడతాయి .

అలాంటి ఫ్రిజ్ లో గడాఫీని పెట్టి శీతలీకరించారు . చూడాలి అనుకున్నవారు ఫ్రిజ్ తలుపు తీయటం చూడటం జరిగిందన్న మాట. ఈ పబ్లిక్ ఫ్రిజ్ **Misrata** పట్టణం లోనిది . ప్రజలు వినోదంగా వచ్చి చూసారు ."మా ఈ మహా చక్రవర్తి నుదుట దేముడు వేరే రాత రాసాడు . లేకపోతే ఈ పాటికి నేలలో ఉండవలసిన వాడు " అని చెప్పుకొని జనం ఆనందించారు .

అదే **October 20,** న **Misrata** మిలిటెంట్లు - వేరే ఎక్కడనో దాక్కున్న గడాఫీ కొడుకు **Mutassim,**ను కూడా పట్టుకున్నారు . ఆరోజున అతడు తన తండ్రి వెంట వున్న వారికి నాయకత్వం వహించాడు . ఇతన్ని పట్టుకున్నప్పుడు కూడా ఒక వీడియో తీశారు . ఆ వీడియో ప్రకారం అతను స్పృహలో ఉండి నడిచాడు . నీరు సిగిరెట్ త్రాగాడు . కానీ ఆ సాయంత్రానికే అతడు చచ్చి శవమైనాడు . ఇది

కస్టోడియల్ డెత్ కాబట్టి దీనిమీద కూడా విచారణ చేయాలని **Amnesty International** మరియూ **Human Rights Watch** అనే సంస్థలు కోరాయి .

సహజమరణం పొందకుండా, వేరేరకంగా మరణం పొందిన వారి మరణానికి గల కారణాలను ప్రశ్నించటమే , దేముడు మానవులకు ఇచ్చిన కర్తవ్యము అని తెలుసుకొందాము . అందువల్లనే ఎవరన్నా చనిపోయినారు అనగానే - మనము ఆ చావు సహజమైనదేనా కాదా అన్న ఆలోచనతో అనేక వివరాలు అడిగి తెలుసుకుంటాము . అనుమానం వస్తే పోలీస్ లకు చెపుతాము .

**Misrata** మిలిటెంట్లు - **150** మంది గడాఫీ అనుచ రులను ప్రాణాలతో బంధించారు . వీరిలో **66** మంది ఆ మరునాటికి - **Mahari** అనే ఒక హోటల్ లో చచ్చికనిపించారు . ఇవి కూడా కస్టోడియల్ డెత్ లే అయ్యాయి . దీనితో **2011** లిబియా సివిల్ వార్ ఆనేది ఎనిమిది నెలల పాటు సాగి - చివరికి ముగిసింది.

గడాఫీ అనుచరులను చంపినా **Misrata** పట్టణపు మిలిటెంట్లు వంటి వారిపై లిబియా ప్రభుత్వం ఎలాంటి చేర్యలూ తీసుకోవాటానికీ సాహసించక పోవటం వల్ల లిబియాలో మిలిటెంట్ల బలము ప్రభావము ఇంకావుంది అని గ్రహించాలి .

లిబియా దేశము గురించి **{9}**

గడాఫీ తరువాతి లిబియా **-{1}**

లిబియా చరిత్ర బిఫోర్ గడాఫీ ఆఫ్టర్ గడాఫీ గా విభజిస్తారు.

లిబియా ప్రభుత్వము వారు .గడాఫీని చంపిన **Misrata** మిలిటెంట్ల **--** పై ఎలాంటి చేర్యలూ తీసుకోవాటానికీ సాహసించక పోవటం వల్ల , లిబియాలో ఇంకానూ మిలిటెంట్ల బలమే ఉందని ప్రపంచము అనుకున్నది, అని చెపుతూ ఎనిమిదో దో ఎపిసోడు ముగించాను .

**2011** లో గడాఫీ మరణం తరువాత **2014–2020,** మధ్య లిబియాలో మరో సారి సివిల్ వార్ జరిగింది . ఇది లిబియా సివిల్ వార్**-2 . 2011** సివిల్ వార్ తరువాత లిబియాలో ఒక ప్రజా ప్రభుత్వం ఏర్పాటు అయింది కదా **?** అది **General National Congress.** అనే వారి ప్రభుత్వము .లిబియా ప్రజాస్వామ్య దేశము అయ్యింది కనుక **- 25 June 2014,** ఎన్నికలు జరిగాయి . ఆ ఎన్నికలలో కంగ్రెస్ వారు ఒడి పోయి **HoR** అనే పార్టీ వారు అధికారంలోకి వచ్చారు . గడాఫి చనిపోయిన వెంటనే జరిగిన ఎన్నికలలో **60 %** ప్రజలు పాల్గొనగా, ఈ ఎన్నికలలో **18 %** జనం మాత్రమే ఎన్నికలలో పాల్గొన్నారు . భద్రతా కారణాలు అంటూ కాంగ్రెస్ వారు అనేక ప్రాంతాలలో అసలు ఎన్నికలే జరపలేదు .

అతి తక్కువమంది ప్రజలు ఎన్నికలలో పాల్గొనగా ఏర్పడిన ప్రభుత్వానికి , ప్రధాన మంత్రి **Abdullah al-**థాని. అధికారము ఇతని మరియూ ఇతని మంత్రి వర్గము చేతుల్లో కి వెళ్ళింది . లిబియా సుప్రీం కోర్టు **--25 June 2014** న దేశంలో జరిగిన ఎన్నికలు చెల్లవు అని **-** ప్రభుత్వమూ రద్దు అయిపోవాలి అని తీర్పు ఇచ్చింది . దీనికి ప్రధాన మంత్రి **Abdullah al-Thani,** ఒప్పుకోలేదు . "కొందరు మిలిటెంట్లు , జడ్జీలను తుపాకులతో బెదిరించి ఈ తీర్పు

ఇప్పించారు" అని ఆరోపించాడు . ఎట్టకేలకు అధికారం **HOR** వారినుండి చేజారి - **6 October 2015** నుండీ తిరిగి **General National Congress** వారి చేతిలోకి పోయింది .

పై వివాదాలు జరుగుతూ ఉండగా - లిబియా రాజధానిని ట్రిపోలీని మిలిటెంట్లు ఆక్రమించుకున్నారు . అందువల్ల **General National** కాంగ్రెస్ పార్టీ వారు తమ రాజధానిగా **tobruk** అనేపట్టణాన్ని ఎంచుకున్నారు . **tobruk** అనే ఈ లిబియా పట్టణము - ఇటలీ కి అతి దెగ్గరిగా వున్న పట్టణము . అప్పుటి మంత్రులు **tobruk** లో తమకు సరిపడు అధికారానివాసాలు లేవు అని చెప్పి, ఒక పెద్ద ఓడను ఇటలీ నుండి అద్దెకు తీసుకొని అందులో అధికార కేంద్రాన్ని ఏర్పాటు చేశారు . తరువాత ప్రభుత్వాన్ని **Tobruk** లో వున్న **the Dar al-Salam** అనే హోటల్ కి మార్చారు . ఇలాంటప్పుడు లిబియాలో వున్నప్రజా ప్రభుత్వాన్ని కూల్చ దలిచిన మిలిటెంట్లకు ఆ ఓడను గానీ ఆ హోటల్ ని గానీ నాశనం చేస్తే సరిపోతుంది గదా ?అని అమెరికా ఆలోచించింది .

అందు కని అమెరికా ఈ మోడల్, { అనగా ఓడల మీద హోటల్ లోనూ వుండే ప్రభుత్వాన్ని చూసి } - లిబియాలో జోక్యం చేసుకొని - కోర్టు తీర్పుతో ప్రభుత్వము పోగొట్టుకున్న **HoR** వారు - కోర్టు తీర్పు మూలకంగా ప్రభుత్వము ఏర్పరిచినవారు ఇద్దరూ కలిసి ఒక ఒప్పందానికి వచ్చేట్లు చేసింది . దాన్ని **"Skhirat Agreement"** అంటారు . ఈ ఒప్పందం కింద తొమ్మిది మంది సభ్యులు గల **Government of National Accord {GNA }**అనేదాన్ని కొత్తగా ఏర్పాటు చేసి దానికి ప్రభుత్వ ము అప్పగించారు . దానికి ఇరుపక్షాల

వారు సలహాదారులుగా వుంటారు . ఆపై వచ్చే రెండు సంవత్సరాల లోగా ఎన్నికలు జరుపుకోవాలని కూడా ఒప్పందం లో వుంది .

**2017** ఏప్రిల్ వరకూ ఎలెక్షన్లు జరగలేదు .

ట్రిపోలీ నే లిబియాకు అసలు రాజధాని -కానీ దాన్ని మిలిటెంట్లు ఆక్రమించుకున్నారు అని చెప్పుకున్నాము కదా ? ఆ ట్రిపోలి పట్టణాన్ని యునైటెడ్ నేషన్స్ తన ఆధీనంలోకి తీసుకుంది .శాంతి యుత ప్రజా జీవనాన్ని కల్పించటానికి - మరియూ ట్రిపోలి లోని మిలిటెంట్లను ఏరి వేయటానికి గానూ యూ యెన్ దళాలు ట్రిపోలీ లో మకాం వున్నాయి .ఈ యూ యెన్ వారికి - లిబియాలో ప్రభుత్వాన్ని నడుపుతున్న **Government of National Accord** కమిటీ అండ ఉంది . ఇలాంటి ట్రిపోలీ పట్టణాన్ని మిలిటెంట్ల చెర నుండీ విడిపిస్తాము అంటూ-- **HoR** నుండి మద్దతు గల లిబియన్ నేషనల్ ఆర్మీ అనే సంస్థ బయలు దేరింది. కానీ యు యెన్ వారి మద్దతు గల **Government of National** అకార్డ్ ఏ ట్రిపోలీ పట్టణాన్ని ఆక్రమించుకో గలిగింది . లిబియన్ నేషనల్ ఆర్మీ **14** నెలల పాటు ట్రిపోలీ కోసం పోరాడి చివరికి వెనక్కి తగ్గింది , ఈ తిరుగు బాటులో **2500** మంది కి పైగా ప్రజలు మరణించారు .

**4 April 2019,**లో ఎన్నికలు జరిపారు . ఎన్నికలలో మొదటి విడత పూర్తి కాగానే **United Nations Support Mission in Libya {**లిబియాలో ఆయుధ పోరాటం లేని అధికార మార్పిడిని పర్యవేక్షించే అంతర్జాతీయ సమస్త **- }** జోక్యం చేసుకొని - ఎలక్షన్ సందర్భంగా లిబియాలో హింస- తీవ్రవాదము జరిగాయని పేర్కొంటూ . మిగిలిన ఎన్నికలను వాయిదా వేయించింది . మీరు గమనించినట్లయితే - బడుగు దేశాలలో ఎలక్షన్లు జరిగినపుడు -- యూ యెన్ ఆ ఎలక్షన్

పర్య వేక్షించ టానికి తన అధికార ప్రతినిధులను పంపుతుంది . వీరు వచ్చి చూసి వెళ్లి ఎన్నికలు సక్రమంగా జరిగాయని నివేదిక ఇస్తే సరే సరి . లేదంటే అమెరికా వెళ్లి ఆ దేశంలో కాలు పెడుతుంది .

లి బియాలో ని **2019,**ఎన్నికలు మధ్యలోనే నిలిచిపోగా **-** అవి **2020 -** లో జరుగుతాయి అని **"Aguila Saleh " {Libyan Speaker of the House }** ప్రకటించాడు . కానీ ఇంతలో **COVID-19** వచ్చేసింది . దానితో ఎలక్షన్స్ జరగలేదు

**August 2020** లో లిబియా పట్టణాలలోని ప్రజలు **-** నీరు **,** గ్యాసు, విద్యుత్ వంటి సౌకర్యాల లేమి పట్ల వీధి పోరాటాలకు దిగారు .దీనికి తోడు **COVID-19** సందర్భంగా వచ్చిన ఆంక్షలు **, COVID -19** గురించి ఎవరూ ఏమీ చేయకపోవటం గురించి లిబియా ప్రజలు రగిలి పోయారు .

మీకు గుర్తున్నదా **?** గడాఫీ ని దేశం విడిచి పారి పొమ్మని సలహా ఇచ్చిన అతని అనుచరులు **"** ప్రజలు నీరు విద్యుత్ వంటివి లేక నీమీద కోపంతో వున్నారు. నీవు మరల ప్రభుత్వం ఏర్పాటు చేయలేవు పారిపో "అని చెప్పారు అని రాసాను , . ఈ అల్లరులను పట్టి చూస్తే లిబియాలో నీరు విద్యుత్ కొరత ఉందని తెలుస్తున్నది . అందువల్ల గడాఫీ హయాములోమాత్రమే లిబియాలో ఏదో అభివృద్ధి జరిగింది అంటే అది గుడ్డి కన్నా మెల్ల బెటర్ అన్నట్లుగా జరిగిన అభివృద్ధి అని నా అభిప్రాయము .

లిబియా గవర్నమెంట్ వారి అదుపులో నూ, మరియూ మిలిటెంట్ల అదుపులో నూ వున్న పట్టణాలలో కూడా ఒకే రకంగా, నీరు విద్యుత్ వంటి సమస్య ల మీద అల్లరులు జరిజి అవి త్రీవ్ర స్థాయికి

చేరుకున్నాయి . ప్రభుత్వ భద్రతా దళాలు ప్రజలమీదకు కాల్పులు జరిపాయి . ఈ కాల్పులకు కారణం ఏమిటో   విచారణ చేయిస్తామని- ఏది ఏమైనా   ---ప్రజలకు నిరసన తెలిపే హక్కు వున్నదని తాము గుర్తిస్తున్నాము---- అని  లిబియా ప్రభుత్వము  అన్నది .   ప్రజల మీద అట్లా ఎందుకు కాల్పులు జరిపారు ? అని ఎవరూ అడగక ముందే - ప్రజలను శాంతిప చేయటానికి " మీకు హక్కువున్నది"  అనే మాటలు వాడింది . ఎక్స్ట్రాగా ఒక్క మాట మాట్లాడటం ఎంత ముప్పో ఇక ముందు తెలుస్తుంది .

ఈ అల్లరుల నేపథ్యంలో - మరియూ ప్రకటన నేపథ్యంలో    లిబియాలో వున్న  నాలుగైదు త్రీవ్రవాద సంస్థలు కలిసి **18 December 2018** న ఒక గ్రూప్ గా ఏర్పడి **"Tripoli Protection Force "**గా ఆవిర్భవించాయి .  ఈ సంస్థ కూడా  - వీధి లో నిలబడి నిరసన తెలపటం అనేది ప్రజలయొక్క ప్రాధమిక  హక్కు అని-- తాను సాధారణ ప్రజల తరఫున మిలిటెంట్ శక్తిగా నిలబడుతున్నాను అని- ప్రకటించింది .   తాము పలికిన మాటలే మిలిటెంట్ల నుండి లిబియా పాలకులు విన్నారు .    మీకు  ఓపిక ఉంటే - మీరూ  ఎదో ఒక ప్రజా  సమస్యను నెత్తికి ఎత్తుకొని  రాజకీయాలలోకి దిగవచ్చును-  అని దీని వల్ల తెలుస్తున్నది  .

చివరిలో **The United Nations Support Mission in Libya (UNSMIL)** అనే   యూ యెన్ సంస్థ కూడా  -- సాధారణ ప్రజల పై కాల్పులు జరగటం గురించి విచారణ జరగాలని పట్టు పట్టింది .      ఒక గన్ మెన్ అత్యుత్సాహంతో రబ్బరు గుండ్లకు బదులు  నిజమైన తుపాకీ గుండ్లు పేల్చడం వల్లనే  జనం మరణించారని లిబియా ప్రభుత్వము

అన్నది . దీనికి భాద్యులుగా పేర్కొంటూ మంత్రి వర్గాన్ని మిలటరీ చీఫ్ ని మార్చారు .

ఏది ఎట్లాగున్న తమకు సౌకర్యాలు లేవంటూ ప్రజలు చేస్తున్న అల్లరులు మాత్రం ఆగలేదు .పైగా తమకు ఎన్నికల ద్వారా ఏర్పడ్డ ప్రభుత్వము - కావాలి అని నినదించారు . ఈ సారి వీరికి కార్మిక జనం కూడా జత కలిశారు . తిరుగు బాట్లు జోరు అందుకున్నాయి . ఈ అల్లరులలో మొత్తము నలుగురు మరణించారు అని **CNN** చానెల్ చెప్పింది.ఆ తరువాత " లిబియా .. తిరగబడు " అనే నినాదం పుట్టింది . "అరబ్బీ వేసవి తరువాత అరబ్బీ వసంతము " అనే ఒక కొత్త నినాదం కూడా పుట్టింది . ఆ తరువాత అరబ్ దేశాలలో ఎక్కడ ఏ అల్లరులు జరిగినా అక్కడి ప్రజలు "అరబ్బీ వేసవి తరువాత అరబ్బీ వసంతము "అనే స్లోగన్ అందుకున్నారు . ఒక మాట ను చక్కగా అల్ల గలిగితే అది ఎంతటి శక్తిని పుంజుకుంటుందో అన్నది దీనివల్ల మనము తెలుసుకోవచ్చును .

ఈ అల్లరుల దృష్ట్యా - యూ యెన్ వారు మద్దతు ఇచ్చి ఏర్పరిచిన **the Government of National Accord,**తరఫున లిబియా ప్రధానిగా వున్న **Fayez al-Sarraj** తాను ప్రధాని అల్లరులకు భాద్యత వహిస్తూ పదవి నుండి పై తొలుగుతానని ప్రకటించాడు . కానీ ఆ మాటను నిలబెట్టుకోలేదు .

**2023** లో లిబియాలోఎన్నికలు జరుగుతాయని - దేశపు ఎలక్షన్ కమీషన్ ఆదిశగా ప్రయత్నం చేస్తున్నదని - ఆ నాటి ప్రధాని **Abdulhamid Dabaibaa.**ప్రకటించాడు ఇంతకు ముందు మనము .**Fayez al-Sarraj** ప్రధాని పదవికి రాజీనామా చేయలేదు అని చెప్పుకున్నాము . కానీ **Abdulhamid Dabaibaa** అన్న

ప్రధాన మంత్రి ఈ ప్రకటన చేసాడు అని చెపుతూ వున్నాను . మరి ఈయన ఎవరు ?

**10 March 2021** నుండీ అధికారము **The Government of National Unity** అనే దాని చేతిలోకి పోయింది . యు యెన్ వారు స్థాపించిన **Government of National Accord** మరియూ దాని వ్యతిరేకులు కలిసి ఒక రాజీకి వచ్చి **The Government of National** యూనిటీ అనే దానిని ఏర్పరిచి దాని తరఫున **Abdulhamid Dabaibaa** ని లిబియా కి ప్రధాన మంత్రిని చేశారు . ఈయన రాజకీయాలలో కి దిగిన వ్యారవేత్త .ఇతనికి టర్కీ కతర్ అల్జీరియా పాకిస్తాన్ పాలస్తీనా ప్రభుత్వాల మద్దతు వున్నది.

" తొందరలో ఎలక్షన్స్ పెడతాను" అని ప్రజల కు ఆశలు కలిగిస్తూ రాజ్యం చేసేవాడు అని ఈయనకు పేరు వచ్చింది . కాదు నేను ప్రజలకే అధికారం అప్పగించుతాను అని ఈయన అంటాడు . కానీ అప్పగించడు .నేడు లిబియాపై ఇతడే పాలకుడు .ఇతని రాజధాని ట్రిపోలి .

లిబియా పై చెప్పదలచుకున్నది ఇక ఆపుదాము అనుకోని త్వరత్వరగా ముగించాను - ఎంతో అభివృద్ధి చెందినది అన్న లిబియా ఎకానమీ ఏమైంది అన్నది కూడా చెప్పి - అప్పుడు మరి ఇక లిబియా జోలికి పోను .

## లిబియా దేశము గురించి {10 and ఫైనల్ } 06-03-24

లిబియా ఎకానమీ ఏమైంది ?

బిఫోర్ గడాఫీ అండ్ ఆఫ్టర్ గడాఫీ అన్నట్లుగా లిబియా చరిత్ర విభజించారు .

**August 2020** లో ,  లిబియా పట్టణాలలో ని ప్రజలు **-** నీరు , గ్యాసు, విద్యుత్ వంటి సౌకర్యాల లేమి పట్ల వీధి పోరాటాలకు దిగారు **.**దీనికి తోడు **COVID-19** సందర్భంగా వచ్చిన ఆంక్షలు **, COVID -19** గురించి ఎవరూ ఏమీ చేయకపోవటం గురించి లిబియా ప్రజలు రగిలి పోయారు **.**

మీకు గుర్తున్నదా **?** గడాఫీకి  సలహా ఇస్తూ అతని అనుచరులు **"** ప్రజలు నీరు విద్యుత్ వంటివి లేక నీ మీద కోపంతో వున్నారు**.** నీవు మరల ప్రభుత్వం ఏర్పాటు చేయలేవు పారిపో **"**అని చెప్పారు **- .** అని రాసాను ఈ అల్లరులను పట్టి చూస్తే లిబియాలో నీరు విద్యుత్ కొరత చాల ఉందని తెలుస్తున్నది **.** గడాఫీ హయాములో లిబియాలో ఎదో అభివృద్ధి జరిగింది అనుకుంటే అది సరి ఐన నిర్వాహణ లేక ఇప్పుడు ఎండి పోయిన చెరువు లా అయ్యిందని అని నా అభిప్రాయము **.**

వరల్డ్ బ్యాంకు వారి నివేదిక **June 6, 2023 —**ప్రకారము లిబియలో అభివృద్ధి పనులు లేని కారణంగా ఆ దేశ ఎకానమీ తిరోగమనం లో వుంది **.** లిబియా లో ఆయిల్ ఉత్పత్తి మందగించింది **. .2011** లిబియా తిరుగు బాటుకు ముందు రోజుకు**1.6 million** బ్యారెల్స్ చమురు ఉత్పత్తి అయ్యేది **. .** లిబియా తిరుగుబాటు తరువాత ఈ ఉత్పత్తి క్షీణించి రోజుకు **1.0 million** బ్యారెల్స్ అయ్యింది **.**

**.** కారణం**--** లిబియా ఆయిల్ కంపెనీలలో పని చేసే శ్రామికులందరూ **-** ఎప్పుడో ఒకప్పుడు ఎదో ఒక తీవ్రవాద గ్రూప్ లో సభ్యులు గా పని చేసిన వారే అయి ఉండేవారు **.** అలంటి వారికే ఉద్యోగాలు దక్కాయి **.** ఉద్యోగాలు దక్కుతాయి అన్న ఆశతోనే యువత ఉద్యమాలలో పాల్గొంది కూడాను **.**

ఆయిల్ కంపెనీలకు చేయవలసిన మరమత్తులు నిర్వహణ వంటి పనులు -- వృత్తి నిపుణులచే కాక మామూలు శ్రామికులచే చేయించారు . ఓల్వో బస్సును స్కూటీ మెకానిక్ కు అప్పచెప్పినట్లు . ఇది కాక లిబియాలో ఎప్పుడూ ఏవో ఒక తిరుగు బాట్లు జరుగుతూనే ఉంటాయి కదా ? ఆ తిరుగు బాటు దారులు ఆయిల్ ఉత్పత్తికి , సరఫరాకు ఆటంకాలు కలిగించి , తమ డిమాండ్లు సాధించుకో చూసారు . ఆయిల్ రంగ కార్మికులు తమ జీత భత్యాలు పెరగాలని కోరుకున్నపుడెల్లా ఆయిల్ ఉత్పత్తిని అడ్డుకొని దేశ ఎకానమీని పతనం దిక్కుకు నడిపించారు .

గడాఫీకి వ్యతిరేకంగా యూ యెన్ బలగాలు లిబియా రావటానికి ముందు -- లిబియాకు విదేశాలలో **150 billion** డాల్లర్ల ఆస్తులు ఉండగా యూ యెన్ వాటిని స్తంభింప చేసింది . ఈ స్తంభింపబడిన బడిన సంపదనుండి **21** బిలియన్ డాలర్ సంపద మాత్రమే ఆ తరువాత లిబియా కు అందింది. ఫ్రీజ్ చేసిన ఆస్తులను విడుదల చేయాలని లిబియాలోనిమారిన ప్రభుత్వాలు కోరినపుడెల్లా " లిబియాలో ఆర్ధిక - సాంఘిక స్థిరత్వం - శాంతి కల్పించటానికి గానూ ఈ సంపద ను ఫ్రీజ్ చేసి ఉంచటం అవసరం అని "యూ యెన్" అన్నది . అంటే యూ యెన్ తన ఖర్చులను ఈ నిధులనుండి రాబట్టుకుంటూ వున్నది అని . అసలు విషయము ఏమిటంటే ? లిబియా దేశము పోయి ఏ విదేశీ , కంపెనీలలో పెట్టు బడులు పెట్టిందో , వారు లిబియా సొమ్ములను అడిగిన వెంటనే వెనక్కి ఇచ్చే ఉద్దేశ్యం లో లేరు . మనము చేబదులు తెచ్చి తిరిగి తీర్చటానికి తాత్సారం చేసినట్టు ఇది జరిగింది .

ఇంగ్లాండ్ వారు " లిబియా కనుక తన ఆస్తులను తాను మేనేజ్ చేసుకోగల సామర్ధ్యము తనకు వున్నదని రుజువు పరచుకుంటే - మా దేశంలో లిబియా కుగల ఆస్తులను తిరిగి ఇచ్చి వేస్తాము " అని ప్రకటించినది . దీని అర్ధము లిబియా తన డబ్బు ఎలా? ఎక్కడ? దేనిమీద? ఖర్చు పెట్టబోతూ ఉందొ అనే ప్లాన్ను రూపొందించి ఇవ్వమని కోరినట్లు . ఈ

ప్లాన్ యూ యెన్ కి నచ్చ లేదు అనుకోండి - లిబియా అణ్వాయుధాలు రూపొందిస్తున్నది అని ఆరోపించి - అప్పుడు  కూడా సొమ్ముని ఇవ్వరు . ఇదొక తెలివి . **U.S. Treasury Department** - అమెరికాలో లిబియాకి వున్న  **$30 billion** డాలర్ల సంపదపై  నిషేధం  ఎత్తి వేసింది .

ఏది ఎట్లావున్న ఆయిల్ కంపెనీలలో పనిచేసే శ్రామికులు జీతాలు పెంచాలని అడగటం ఆపలేదు . వారుఅందరూ  ఒకప్పుడు ఏదో ఒక  త్రీవ్ర వాదగ్రూపుల లోని సభ్యులు కదా **?**   కాబట్టి - ప్రభుత్వం వారిని గట్టిగా ఏమీ అనలేక పోయింది . దీనివల్ల లిబియా అయిల్ ఉత్పత్తి తగ్గి - లిబియాలో ఆయిలు ఉత్పత్తి/ తయారీ  ధరలు పెరిగాయి   -  అట్లాగే అంతర్ జాతీయ మార్కెట్లలో ఆయిల్ ధరలు తగ్గేయి . ఇట్లా  లిబియా క్రమంగా తన ఎకానమీలోని పెరుగుదల ను కోల్పోయింది

లిబియాలో జీవనదులు లేవు .ఇలా పారి అలా మాయం అయ్యే బురద నదులు వున్నాయి.  ఎడారిలోని పెద్ద  ఒయాసిస్సులే - మనుషులకు పశువులకూ త్రాగు నీటిఆధారము.  అందువల్ల ఇక్కడ నీటి కరువు సాధారణము . నీటి ఆధారిత విద్యుత్ ఉత్పత్తి కష్టము . చమురు ఆధారిత విద్యుత్ ఉత్పత్తి ఏ ఎక్కువ .ఈ పవర్ ప్రోజెక్టు ల సాంకేతిక నిర్వాహణ లిబియా వారికి తెలియదు . అందువల్ల విద్యుత్ కొరత సామాన్యము

-- ది ఎండ్--

సేకరణ వివరణ సమర్పణ వారణాసి శ్రీ రామ కృష్ణ అమరావతి--

లిబియా పై ఎంతో వుంది . కాస్తలో ముగించాను అన్న అసంతృప్తి వున్నది.

అన్ని భాగాలు కలిసి ఒక డిజిటల్ బుక్ వేసాను . కావాలన్న వారు అడగండి .